## సదాశివ సమారంభాం


గురు దక్షిణామూర్తి


గురు వేదవ్యాస మహర్షి


గురు శుక మహర్షి


గురు నారద మహర్షి


గురు వాల్మీకి మహర్షి


గురు శ్రీకృష్ణ

## శంకరాచార్య మధ్యమాం


గురు దత్తాత్రేయ


గురు బాబాజీ


గురు గౌతమ బుద్ధ


గురు ఆదిశంకరాచార్య


గురు రామానుజాచార్యులు


గురు జ్ఞానేశ్వర్


గురు రవిదాస్


గురు కబీర్ దాస్


గురు చైతన్య మహా ప్రభువు


గురు నానక్


గురు రాఘవేంద్ర స్వామి


గురు వీరబ్రహ్మేంద్ర స్వామి


యోగి వేమన

## అస్మదాచార్య పర్యంతాం


గురు త్రైలింగ స్వామి


గురు లాహిరి మహాశయ


గురు రామకృష్ణ పరమహంస, అమ్మ శారదాదేవి


గురు వివేకానంద


గురు సాయి బాబా


గురు అరబిందో


గురు రమణ మహర్షి


గురు యోగానంద


గురు భక్తివేదాంత ప్రభుపాద


గురు మళయాళస్వామి


గురు విద్యాప్రకాశానందగిరి


గురు చంద్రశేఖర పరమాచార్య

## వందే గురుపరంపరాం..




నన్ను "నేను" తెలుసుకోవటానికి

నన్ను "నేను" మార్చుకోవటానికి

"నేను" గా ఉండటానికి

మరియు అత్యుత్తమ జీవన విధానానికి

కావలసిన భక్తి,జ్ఞాన,కర్మ,ధర్మ సమాచారం ఒకేచోట తెలుగులో ఉచితంగా!

సాధారణంగా వేదాంతం తెలుసుకోవాలనే కోరిక వుంటుంది, కాని గ్రంధాలు అందుబాటులో లేవు. ఇంకొకరి దగ్గర గ్రంధాలు వుంటాయి, కాని జిజ్ఞాసువులకి ఎక్కడ ఉన్నవో తెలియదు. అలాగే కొన్ని లైబ్రరీ లో కొన్ని రకాల పుస్తకాలు మాత్రమే లభ్యం అవుతున్నాయి. కనుక తమవంతుగా భక్తి,జ్ఞాన ప్రచారార్ధం మహానుభావులైన **తెలుగు భక్తి** వెబ్ సైట్ వారు ఉచితంగా విలువైన గ్రంధాలను ఆన్ లైన్ ద్వారా eBOOK(PDF) రూపంలో అందిస్తున్నారు. వారు చేస్తున్న జ్ఞాన యజ్ఞానికి సాయి రామ్ కూడా తమవంతుగా సహాయం చేసే కార్యక్రమంలో భాగంగా వారి గ్రంధాలను సాయి రామ్ ద్వారా కూడా అందచేస్తున్నాము, ఇందుకు మేము వారికి కృతజ్ఞత తెలియచేసుకుంటున్నాము. కనుక ప్రతి ఒక్కరు ఈ సదవకాశాన్ని సద్వినియోగం చేసుకోగలరు. ఇందుకు సహాయం చేసిన ఆర్కైవ్ వెబ్ సైట్(https://archive.org), గూగుల్ వెబ్ సైట్(https://www.google.co.in),మైక్రోసాఫ్ట్ సైట్(http://www.microsoft.com) వారికి కూడా మేము ఋణపడివున్నాము. సాయి రామ్ సేవక బృందం కోరుకొనేది ఒక్కటే, ప్రతి ఇల్లు ఆధ్యాత్మిక జ్ఞాన గ్రంధాలతో నిండిపోవాలన్నదే మా కోరిక.

ఈ గ్రంధాలను ఉచితంగా ఆన్ లైన్ లో చదువుటకు, దిగుమతి(డౌన్లోడ్) చేసుకొనుటకు గల మార్గాలు:

1) **తెలుగు భక్తి** వారి వెబ్ సైట్: http://www.telugubhakti.com/
2) సాయి రామ్ వెబ్ సైట్: http://www.sairealattitudemanagement.org
3) సాయి రామ్ గూగుల్ సైట్: https://sites.google.com/site/sairealattitudemanagement
4) ఆర్కైవ్ వెబ్ సైట్: https://archive.org/details/SaiRealAttitudeManagement

ఈ జ్ఞాన యజ్ఞం పై గల సలహాలు,సూచనలకు సేవక బృందాన్ని సంప్రదించుటకు: sairealattitudemgt@gmail.com
సాయి రామ్ భక్తి,జ్ఞాన సమాచారం: https://www.facebook.com/SaiRealAttitudeManagement
సాయి రామ్ భక్తి,జ్ఞాన సంబంద వీడియోలు: https://www.youtube.com/user/sairealattitudemgt

ఈ జ్ఞాన యజ్ఞంలో ప్రతి ఒక్కరు పాల్గొని, ఈ అవకాశాన్ని సద్వినియోగం చేసుకొని,మీరు సంతృప్తులైతే మరొక సాధకునికి, జిజ్ఞాసువులకు మార్గం చూపించగలరని ఆశిస్తున్నాము.



**SaiRealAttitudeManagement(SAI RAM) - సాయి నిజ వ్యక్తిత్వ నిర్వహణ(సాయి రామ్)**

* సర్వం శ్రీ సాయి నాథ పాద సమర్పణమస్తు *

## తెలుగు భక్తి వారి వెబ్ సైట్:

## http://www.telugubhakti.com/

Telugu Bhakti Slokas

www.telugubhakti.com/telugupages/main.htm

# Telugu Bhakti Pages

www.telugubhakti.com

**Best viewed with screen settings 1280X1024 pixels**

### Scriptures, Slokas and Stotras

- Adi Sankaracharya
- Aditya
- Adwaitam
- Ayyappa
- Bhagavad Geetha
- Bammera Pothana
- Bhagavatam
- Brahma Sutras
- Durga
- Dattatreya
- Ganesh
- Gayatri
- Guru
- Hanuman
- Hindu Marriage System
- Krishna
- Lakshmi
- Mahabharat
- Mantrapushpam
- Narada Bhakti Sootralu
- Nava Grahas
- Patanjali Yoga Sootralu
- Raghavendra
- Rama
- Ramayanam
- Rama Geeta
- Saraswathi
- Sandharbha
- Satya Sai
- Shirdi Sai
- Siva
- Slokas with meaning
- Subrahmanya
- Suktas
- Sundara Kanda
- Venkatesa
- Vishnu
- Vratas
- Upanishads
- Rigveda
- Samhitaanuvadam
- (Yoga Paranga)
- Vyasa Bhagavatam

### General

- Appeal and Objectives
- Bala Basha
- Bhakti Celebrities
- Bhakti Classicals
- Bhakti Links
- Book Reviews
- Jeji Mamayya Patalu
- Chatuvulu
- Dasa Mudrani
- Divine Guidance of Satya Sai
- Kavitha Kadambam
- Keerthanalu
- Koonalamma Padalu
- Prasnalu - Javaabulu
- Naturopathy
- Rishi Vani
- Sai Krishna's Art
- Satakalu
- Swamiji
- Tatvalu
- Telugu Special
- Useful Links
- Value Education
- Web Hunt
- Hindu Cultural
- Questions & Answers
- Yoga
- Yoga Mudralu Bandhalu
- Yogasanas (Detailed)

### Downloads

- Audio Downloads
- Bhakti Screen Savers
- Printer Friendly Page

**Pravachanaalu**

- Bhaja Govindam
- Bhasmo Dhulita Vigrahaya
- Karma Siddhantam
- Class Prayers
- Kenopanishad
- Sri Narasimha Charitram
- Soundarya Lahari
- Ramana Saranagathi
- Vivekachoodamani

**Specials**

- Annamayya Pada Visleshana
- Monthly
- Satsang
- Chinna Kathalu
- Class Prayers
- Human Relations
- Nadiche Devudu
- Stories of Alwars
- Stories of Bhaktas
- Stories of Indian Sages
- Stories of Nayanars
- Sankara Vangmayamu
- Special Articles
- Hinduism and Mantras
- Personality Development

Join Bhakti Group

Statistics of page views

[About us][Mission][People][Links][Books][Guest Book][Contact]

# అతి విశిష్టం ఈ దానం!

"దానాలలోకెల్లా ఆధ్యాత్మిక విద్యాదానం చాలా శ్రేష్ఠమైంది! దాని తరువాతిది లౌకిక జ్ఞానదానం, ప్రాణదానం, అన్నదానం" అని వ్యాసమహర్షి చెప్పారు.

మన ఆధ్యాత్మిక జ్ఞానం భారతదేశ హద్దులలో నిలిచి పోకూడదు. లోకమంతటినీ ఆవరించాలి! ఇలా లోకవ్యాప్తమైన ధర్మప్రచారాన్ని మన పూర్వులు చేశారు. హైందవ వేదాంతం ఎన్నడూ ఈ దేశం దాటి పోలేదని చెప్పేవారూ, మతప్రచారార్థం తొలిసారిగా, పరదేశాలకు వెళ్ళిన సన్యాసిని నేనే అని చెప్పేవారూ, తమ జాతిచరిత్ర నెరుగని వారే! ఇలాంటి సంఘటనలు ఎన్నోసార్లు జరిగాయి. అవసరమైనప్పుడల్లా, భారతీయ ఆధ్యాత్మిక జ్ఞానప్రవాహం వెల్లువలా లోకాన్ని ముంచెత్తుతూ వచ్చింది.



రాజకీయ ప్రచారాన్ని రణగొణధ్వనులతో, యోధులతో సాగించవచ్చు. అగ్నిని కురిపించి, కత్తిని జళిపించి, లౌకిక జ్ఞానాన్నీ, సంఘనిర్మాణ విజ్ఞానాన్నీ విరివిగా ప్రచారం చేయవచ్చు. కానీ ఆధ్యాత్మిక జ్ఞానదానం కళ్ళకు కనిపించకుండా, చెవులకు వినిపించకుండా కురుస్తూ, రోజా పువ్వుల రాసుల్ని వికసింపజేసే మంచులాగా నిశ్శబ్దంగా జరగవలసి ఉంది. భారతదేశం నిరాడంబరంగా, లోకానికి మళ్ళీ మళ్ళీ చేస్తూ వచ్చిన దానమిదే!

మిత్రులారా! నేను అవలంబించే విధానాన్ని తెలియజేస్తాను వినండి. భారతదేశంలోనూ, ఇతర దేశాల్లోనూ మన పారమార్థిక ధర్మాలను బోధించడానికి తగినవారుగా మన యువకుల్ని తయారు చేయడానికై భారతదేశంలో కొన్ని సంస్థలను నెలకొల్పాలి! ఇప్పుడు మనకు కావలసింది బలిష్ఠులు, జవసంపన్నులు, ఋజువర్తనులు, ఆత్మ విశ్వాసపరులు అయిన యువకులు. అలాంటి వారు నూరుమంది దొరికినా, ప్రపంచం పూర్తిగా పరివర్తన చెందగలుగుతుంది!!

ఇచ్ఛాశక్తి తక్కిన శక్తులన్నిటి కన్నా బలవత్తరమైంది. అది సాక్షాత్తూ భగవంతుని దగ్గరి నుండి వచ్చేదే కాబట్టి దాని ముందు తక్కినదంతా లొంగిపోవలసిందే. నిర్మలం, బలిష్ఠం అయిన 'ఇచ్ఛ' (సంకల్పం) సర్వశక్తిమంతమైంది. దానిలో మీకు విశ్వాసం లేదా? ఉంటే మీ మతంలోని మహోన్నత ధర్మాలను ప్రపంచానికి బోధించడానికై కంకణం కట్టుకోండి. ప్రపంచం ఆ ధర్మాల కోసమై ఎదురుచూస్తోంది. అనేక శతాబ్దాలుగా ప్రజలకు క్షుద్రసిద్ధాంతాలు నేర్పడం జరిగింది. వారు వ్యర్థులని ప్రపంచమంతటా బోధలు జరిగాయి. ఎన్నో శతాబ్దాల నుండి వారు ఈ బోధనల వల్ల భయభ్రాంతులై, పశుప్రాయులైపోతున్నారు. తాము ఆత్మస్వరూపులమనే మాటను వినడానికైనా వారెన్నడూ నోచుకోలేదు. "నీచాతినీచుడిలో కూడా ఆత్మ ఉంది. అది అమృతం, పరమ పవిత్రం, సర్వశక్తిమంతం, సర్వవ్యాపకమైనది" అని వారికి ఆత్మను గురించి చెప్పండి. వారికి ఆత్మవిశ్వాసాన్ని ప్రసాదించండి. ❖

మూలం: శ్రీ రామకృష్ణ ప్రభ - ఫిబ్రవరి 2014

# ఓం శ్రీ సాయి రాం
# భాస్కర శతకము
# (టీకాతాత్పర్యసహితము)

ఈ భాస్కర శతకమును మారన వెంకన 17 వ శతాబ్దిలో రచించెను. ఈ శతాబ్ద లోతుల యందు మక్కువ ఎక్కువ. వేమన వలెనే ఈయన కూడ నీతి పద్యముల చెప్పి నను వేమనయంత ప్రాచుర్యము రాలేదు. వేమన పద్యాలలో గల క్లుప్తత ఇక్కడ కని పింపదు. ఈయనకు రామాయణమన్న మక్కువ ఎక్కువ. ఎక్కువ శ్లోకాల్లో రామాయ ణాన్ని ఉదహరిస్తూ చెప్తారు.

1. శ్రీగల భాగ్యశాలిఁగడుఁ జేరఁగవత్తురు తారుదారె దూ
రాగమన ప్రయాసమున కాదట నోర్చియునైన నిల్వ ను
ద్యోగముచేసి; రత్ననిల యుండని కాదె సమస్త వాహినుల్
సాగరు జేరుటెల్ల ముని సన్నుత మద్గురుమూర్తి భాస్కరా.

భాస్కరా! ఎన్ని ప్రయాసల కోర్చి ఐనను ప్రజలు ధనవంతుని చేరుదురే గాని బీద వాని దగ్గరకు పోరు. నదులన్నియు రత్నములు కలవన్న ఆశతోనే సముద్రుని చేరిన ట్లుగా.

2. అంగన నమ్మరాదు తనయంకెకురాని మహాబలాఢ్యు వే
భంగుల మాయలోడ్డి చెఱుపందలపెట్టు, వివేకియైన సా
రంగధరుం బదంబులుఁగరంబులు గోయగ జేసెఁదొల్లిచి
త్రాంగియనేకముల్ నుడువరానికుయుక్తులుపన్ని భాస్కరా.

17 వ శతాబ్ది యందలి స్త్రీ యందు గల దురభిప్రాయమునకు ఈ కవి కూడ దూరుడుకాడు. చిత్రాంగి సారంగధరుల ఉపమానమును తీసుకొని ఈ పద్యము న కవి చిత్రాంగి తన చేత చిక్కనందుకే సారంగ ధరునికి అంత దురవస్థ కల్పించి నదని స్త్రీలను నమ్మరాదని చెప్పచున్నారు.

3. అక్కఱపాటువచ్చు సమయంబునఁ జుట్టములొక్క రొక్కరి
న్మక్కువనుద్ధరించుటలు మైత్రికిఁజూడగ యుక్తమే సుమీ
యొక్కట నీటిలో మెరక నోడల బండ్లును బండ్లనోడలన్
దక్కక వచ్చుచుండుట నిదానముగాదె తలంప భాస్కరా.

అక్కర వచ్చినపుడు బంధువులు, మిత్రులు ఒకరికొకరు సాయపడవలెను. అవి ఎట్లన పడవలు బండ్ల మీదను, పడవల మీద బండ్లును సమయము వచ్చినపుడు కనిపించు రీతిగా.

4. అడిగినయట్టి యాచకుల యాశ లెఱుంగక లోభవర్తియై
కడిపిన ధర్మదేవత యొకానొకయప్పుడు నీదు వాని కె
య్యెడల నదెట్లు పాలు తమికిచ్చునె యెచ్చటనైన లేగలన్
గుడువఁగనీనిచోఁ గెంలిగోవులు తన్నునుగాక భాస్కరా.

లోభియైన మానవుడు యాచకులను విదవించి కొట్టిన ధర్మదేవత గూడ ఆలోభిని అట్లే విదలించి కొట్టును. (దూడలను పాలు త్రాగనీయకుండు పాలు పిండుకొనదలిచిన ఆవులు ఆ వ్యక్తిని తన్నునే గాని పాలీయవు).

5. అతిగుణహీన లోభికిఁ బదార్థము గల్గిన లేకయుండినన్
మితముగఁగాని కల్మిగల మీఁదట నైన భుజింప డింపుగా
సతమని నమ్ము దేహమును సంపద, నేఱులునిండి పాఱినన్
గతుకగఁజూచుఁ గుక్కదనకట్టడ మీఱకయెందు భాస్కరా.

లోభి తన శరీరము, సంపద శాశ్వతమనుకొని మితముగానే తిననుగాని అతిగా తినడు.కుక్కలు నదులనిండ నీరున్నను నాలికతో తాగునే గాని బాగుగా తాగవు. లోభిని, కుక్కతో పోలుస్తున్నాడు ఈ శతకకారుడు.

6. అదను దలంచికూర్చి ప్రజనాదర మొప్ప విభుండు కోరినన్
గదిపి పదార్థ మిత్తురటు కానక వేగమె కొట్టి తెండనన్
మొదటికి మోసమౌ, బొదుగు మూలముగోసిన బాలుగల్గునే
పిదికినఁగాక భూమిఁబశుబృందము నెవ్వరికైన భాస్కరా.

మచ్చికతో చేకొని పిండిన ఆవులు పాలిచ్చును గాని ఆత్రగాడై పొదుగును కోసివేసిన మొదటికే మోసము వచ్చును. రాజు కూడ ప్రజల అభీష్టమెరిగి సమయ మెరిగి పన్నులు వసూలు చేసిన జనులుమెచ్చుదురు. అట్లు గాక తలచినపుడే తాతపెళ్లి అను దురాత్ముడికి తగిన శాస్తి చేయుదురు.

7. అనఘునికైనఁ జేకుఱు ననర్థునిగూడి చరించినంతలో
మన మెరియంగ నప్పుఁడవమానము కీ ధరిత్రియందు నే
యనువుననైనఁ దప్పదుయథార్థము తానది యెట్టులన్నచో
నినుమునుగూర్చియగ్నినలయింపదె సమ్మెట పెట్టు భాస్కరా.

మంచివాడైనను దురాత్ముడితో చేరిన తిప్పలు ఇనుముతో చేరిన నిప్పుకు వలె తప్పవు.

8. అలఘుగుణ ప్రసిద్ధుఁడగునట్టి ఘనుండొక డిష్టుఁడైతనన్
వలచి యొకించు కేమిడిన వానికి మిక్కిలి మేలు చేయగా
తెలిసికుచేలుఁడొక్క కొణిదెండటకుల్ దనకిచ్చినన్ మహా
ఫలదుఁడు కృష్ణుఁడత్యధిక భాగ్యమునాతనికీఁడె భాస్కరా.

ప్రఖ్యాతి గల గుణవంతుడైన స్నేహితుడు తనకి కొంచెమిచ్చినను కృష్ణుడు కుచేలునికి వలెనే తన మిత్రుని అధిక సంపన్నుని చేయును.

9. అవని విభుండు నేరుపరియై చరియించిన గొల్చువార లె
ట్లవగుణులైన నేమి పనులన్నియుఁ జేకుఱు వారిచేతనే
ప్రవిమల నీతి శాలియగు రామునికార్యము మర్కటంబులే
దవిలి యొనర్పవే? జలధిదాటి సురారులంద్రుంచి భాస్కరా.

నేర్పరియైన రాజు శ్రీరాముని వలెనే తన సేవకులు (కోతులు) అల్పజ్ఞులైనను దుర్లభమైన కార్యములు (రాక్షసుల చంపుట) నెరవేర్చుకొనెదరు.

10. ఆదరమింతలేక నరుఁడాత్మబలోన్నతి మంచివారికిన్
ఖేదము చేయుటం దనదు పేర్మికిఁగీడగు మూలమెట్లను
ర్యాద హిరణ్యపూర్వకశిపన్ ధనుజుండగుణాఢ్యుడైనప్ర
హ్లాదున కెగ్గుజేసి ప్రళయంబును బొందఁడెమున్ను భాస్కరా.

మానవుడు చెడు ప్రవృత్తిచే అధిక బలముచే దుర్బలులను బాధించిన హిరణ్యకశిపుడు నశించినట్లే నశించును.

11. అరయ నెంత నేరుపరియై చరియించిన వాని దాపునన్
గౌరవ మెప్పగూర్చు నుపకారి మనుష్యుడు లేక మేలుచే
కూఱదెట్లు? హత్తుగడగూడునెచూడఁబదాఱువన్నె బం
గారములోనైన వెలిగారము గూడకయున్న భాస్కరా.

ఉపకారియైన మానవుడు స్నేహితుడు కాకున్న ఎంత నేర్పరి యైనను (మేలిమి బంగారమునకు వెలిగారపు అతుకులేకన్న) రాణించలేడు.

12. ఈక్షితి నర్థకాంక్ష మది నెప్పడు పాయక లోకొలెల్ల సం
రక్షకుఁడైన సత్ప్రభుని రాకలఁగోరుదు రెంచుఁజంద్రికా
పేక్షఁ జెలంగి చంద్రుఁడుదయించువిధంబునకై చకోరపుం
బక్షులు చూడవేయెదు రపారమదంబునుబూని భాస్కరా.

వెన్నెల పిట్టలు వెన్నెలయందాసక్తితో చంద్రుని రాకకై ఎదురుచూచు చందమున మానవులు దనాశతో గుణవంతుడైన రాజు కొరకు ఎదురు చూచుచుందురు.

13. ఈ జగమందుఁదామనుజు డెంత మహాత్మకుఁడైన దైవమా
తేజముతపసఁజూచునెడఁ ద్రిమ్మరికోల్పడుఁ నెట్లన న్మహా
రాజకుమారుఁడైన రఘురాముఁడుగాల్నడగాయలాకులన్
భోజనమైతగన్వనికిఁబోయిఁ, చరింపఁడె మున్ను భాస్కరా.

దైవానుగ్రహము లేకున్న ఎంతటి ధీమంతుడైనను. శ్రీరామ చంద్రుని వలెనే దేశ దిమ్మరియై కష్టముల పాటు కావలెను.

14. ఉరుకరుణాయుతుండుసమయోచిత మాత్మదలంచియుగ్రవా
క్యరుషతజూపినన్ ఫలముకల్గుట తథ్యముగాదె యంబుదం
బురిమిన యంతనే కురియకుండనె వర్షము లోకరక్షణ
స్థిరతర పౌరుషంబున నశేషజనంబు లెఱుంగ భాస్కరా.

దయాశాలుర మాట కఠినమైనను (ఉరుములవలె) చివరకు వారు దయనే వర్షింతురు.

15. ఉరుగుణవంతుఁడొర్లుదనకొండవకారము సేయునప్పడున్
బరహితమేయొనర్చు నొకపట్టునైనను గీడుఁసేయగా
నెఱుఁగడునిక్కమేకద యదెట్లనఁగవ్వముబట్టియెంతయున్
దరువగజొచ్చినం బెరుగు తాలిమినీయదె వెన్న భాస్కరా.

గుణవంతుడు తనకు కీడు చేయుచున్నను మంచినే చేయును. అది ఎట్లన పెరుగును చిలికినను వెన్ననే ఇచ్చును కాని కోపగించదు. ఈ పద్యభావము ఒరులేయవిఒనరించిన నరవర తనక ప్రియమంచు.. అన్న పద్య భావాన్ని పోలి యుంటుంది.

16. ఉరుబలశాలనంచుఁదనునొల్లని యన్య, పతివ్రతాంగనా
సురతము గోరునేని కడ సుమ్మది భూతికిఁ బ్రాణహానియౌ
శిరములుగూల రాఘవునిచే దశకంఠుఁడు గ్రుంగిపోఁడే
యెఱుఁగక సీతకనపడి యిష్ట భృత్యులఁగూడి భాస్కరా.

'బలవంతుడు నాకేమని... సుమతీ' ఈ పద్యభావాన్ని పోలినది. రావణుడు తాను బలవంతుడని పరస్త్రీలను చెరబట్టిన సబంధముగా నశించెను.

17. ఊరక వచ్చుఁ బాటుపడ కుండినవైన ఫలంబదృష్టమే
పారఁగఁగల్గువానికిఁ బ్రయాసము నొందిన దేవదానవుల్

వారలటుడుండగా నడుమవచ్చిన శౌరికిఁగల్గెగాదె శృంగా
రపుఁబ్రోవు లక్ష్మియును గౌస్తుభరత్నము రెండు భాస్కరా.

అదృష్టలక్ష్మీ సమేతులైన వారికి ఇతరుల కష్టములలో కూడా లాభమే కల్గును. అది ఎట్లన దేవ, దానవులు క్షీర సముద్రము చిల్కగా అనాయాసముగా విష్ణువుకు లక్ష్మి కౌస్తుభము లభించినట్లు.

18. ఊరక సజ్జనుండొదిగియుండిన నైన దురాత్మకుండు ని
ష్కారణ మోర్వలేక యపకారముచేయుట వాని విద్యగా
చీరెలు నూఱుటంకముల చేసెడివైనను బెట్టునుండగా
జేరి చినింగి పోఁగొఱుకు చిమ్మటకేమి ఫలంబు భాస్కరా.

దురాత్ముడు తన బుద్ధి విశేషము చేత మంచి చీరలను 'చిమ్మెటలు కొట్టి ముక్క లు చేసినట్లుగా మంచివారిని కూడా బాధించును.

19. ఎట్టుగఁబాటుపడ్డ నొకయించక ప్రాప్తములేక వస్తువుల్
పట్టుపడంగ నేరవు నిబద్ధి సురావళిఁగూడి రాక్షసుల్
గట్టు పెకల్చి పాల్కడలి గవ్వముచేసి మథించిరంతయున్
వెట్టియెకాక యేమనుభవించిరి వారమృతంబు భాస్కరా.

అనుభవించు యోగ్యత లేనప్పుడు ఎంత కష్టపడినను ఫలితము దక్కదు. దీనికి ఉదాహరణమే దానవుల క్షీరసాగర మథనము. వారికి అమృతము దక్కలేదు సరి గదా శ్రమయే మిగిలినది.

20. ఎడపక దుర్జనుం డొరులకెంతయుఁగీడొనరించునుగానియే
యెడలను మేలు సేయ డొకయించుకయైనను; జీడపుర్వుతా
జెడఁదినునింతెకాక పుడిసెండు జలంబిడి పెంచనేర్చునే
పొడవగుచున్న పుష్ప ఫలభూరుహమొక్కటినైన భాస్కరా.

దుర్జనుని స్వభావము ఇతరులకు కీడు చేయుటయే. అతడు చీడపురుగు వంటి వాడు.

21. ఎడ్డెమనుష్యు(డే మెఱు(గు నెన్ని దినంబులుగూడియుండినన్
దొడ్డ గుణాఢ్యునందు(గలతోరపు వర్తనలెల్ల(బ్రజ్ఞ బే
ర్పడ్డ వివేకరీతి; రుచిపాకము నాలుక గాకెఱుంగునే?
తెడ్డది కూరలో(గలయ(బ్రిమ్మరుచుండిననైన భాస్కరా.

కూర రుచిని తెడ్డు(గరిట) తెలుసుకోలేనట్లే మంచివాని గుణగణములను మూఢుడు తెలిసికొనలేడు.

22. ఎప్ప డదృష్టతా మహిమ యించుక పాటిలునప్ప డింపుసొం
పొప్పచునుండు(గాక యదియొప్పనిపిమ్మటరూపు మాయ(గా
నిప్పన నంటియున్న యతినిర్మలినాగ్ని గురుప్రకాశముల్
దప్పిన నట్టిబొగ్గునకు( దా నలుపెంతయు( బుట్టు భాస్కరా.

నిప్పుతో కలిసి ఉన్న బొగ్గు ప్రకాశించినట్లే అదృష్టవంతుడు అందచందములతో ప్రకాశించును. అదృష్టహీనుడు బొగ్గు వలే నల్లబడును

23. ఏగతి( బాటుపడ్డ గలదే భువి నల్పునకున్ సమగ్రతా
భోగము భాగ్య రేఖగల పుణ్యునకుంబలె? భూపరిత్వసం
యోగ మదేభకుంభ యుగళోస్థితి మాంసము నక్కకూనకే
లాగు ఘటించు సింహముదలంచిన(జేకుఱుగాక భాస్కరా.

ఈ శతక కర్తకు అదృష్టము, కర్మఫలము ఇలాంటి వాటి మీద గొప్ప నమ్మకము. ఇవి ఒక విధంగా యువతను నిర్వీర్యపరచటము. అల్పుడు నక్క ఏనుగు కుంభస్థలము మీద మాంసము కాశపడినను దొరుకదు. అన్న పద్ధతిని అదృష్టమున కాశపడరాదు.

24. ఏడ ననర్హుఁడుండు నట నేగు ననర్హుఁడు నర్హుఁడున్నచో
జూడగనొల్ల డెట్లన సశుద్ధగుణస్థితి నీఁగ పూయముం
గూడిన పుంటిపై నిలువగోరిన యట్టులు నిల్వనేర్చునే
సూడిద పెట్టు నెన్నుదుటి చొక్కఁగస్తురిమీఁద భాస్కరా.

అయోగ్యుడు వేరొక అయోగ్యుని కడకు 'ఈగ కురుపు మీదకు చేరినట్లే' చేరును గాని యోగ్యుని కడకు పోడు.

25. ఏల సమస్త విద్యల నొకించుక భాగ్యము గల్గియుండినన్
జాలుననేకమార్గముల సన్నుతికెక్క నదెట్లొకోయనన్
ఱాలకు నేడవిద్యలు తిరంబుగ దేవతరూపు చేసినన్
వ్రాలి నమస్కరించి ప్రసవంబులు పెట్టరెమీద భాస్కరా.

విద్యలు నేర్చినంతనే యోగ్యత రాదు. కించిదదృష్టమున్న తప్ప. రాళ్లు దేవతలై మొక్కులందుకునట్లు విద్యలు నేర్వకున్నను కించిదదృష్టమున్న బహు యోగ్యుడని పించుకోవచ్చు.

26. ఒక్కఁడెచాలు నిశ్చలబలోన్నతుఁడెంతటికార్యమైనఁదాఁ
జక్కనొనర్ప గౌరవులసంఖ్యులు పట్టిన దేనుకోటులం
జిక్కగనీక తత్రబలసేన ననేక శిలీముఖంబులన్
మొక్కవడంగఁజేసి తుదముట్టఁడె యొక్క కిరీటి భాస్కరా.

బలవంతుడు స్థిరమైన నడవడి యున్న 'అర్జునుడు గొప్ప సైన్యము నోడిచి గోగణ మును రక్షించినరీతి' ఎంతటి దుర్ఘట కార్యమైనను చేయగలడు.

27. కట్టడదప్పి తాము చెడుకార్యమఁ చేయుచునుండిరేనిఁదో
బుట్టినవారినైన విడిపోవుట కార్యము; దౌర్మదాంధ్యముం
దొట్టిన రావణాసురునితో నెడబాసి విభీషణాఖ్యుఁడా
పట్టున రాముఁజేరి చిరపట్టము గట్టుకొనండె భాస్కరా.

దుష్టుల చెలిమి వదలివేసి సజ్జనులను సరియైన సమయము లందు చేరిన విభీషణుని వలె మానవులు మెలగవలెను.

28. కట్టుడయైన యెట్టి నిజకర్మము చుట్టుచు వచ్చి యేగతిం
బెట్టునొ పెట్టినట్లనుభవింపక తీరదు, కాళ్ళు మీఁదుగాఁ
గిట్టక వ్రేలుఁడంచుఁ దలక్రిందుగఁ గట్టిరె యెవ్వరైన నా
చెట్టున గబ్బిలంబులకుఁ జేరిన కర్మముగాక భాస్కరా.

పురాకృత పాపకర్మను మనుజుడు గబ్బిలము వలె అనుభవించియే తీరవలెను.

29. కట్టడ లేనికాలమునఁ గాదు శుభం బొరులెంతవారు చే
పట్టినైన మర్త్యునకు భాగ్యమురాదను టెల్లఁగల కా
దెట్టని పల్కినన్ దశరథేశ వశిష్టులు రామూర్తికిన్
బట్టము కట్టగోరి రది పాయక చేకుఱె నోటు భాస్కరా

విధి లిఖితము లేకున్న ఎంత గొప్పవారు ఎన్ని విధముల ప్రయత్నించినను శ్రీరాముని పట్టభంగము వలెనే జరుగును.

30. కానక చేరఁ బోలదతికర్ముఁడు నమ్మికలెన్ని చేసినం
దానది నమ్మి వానికడ డాయఁగ బోయిన హానివచ్చు న
చ్చోటనదియెట్లనంగొణుఁకుచూపుచు నొడ్డినబోను మేలుగాఁ
బోననికానకాసపడిపోవుచుఁ గూలదె కొక్కు భాస్కరా.

పాపాత్ముడు ఎన్ని నమ్మకములైన పనులను చేసినను పందికొక్కు బోనులో ఎరను నమ్మినట్లే నమ్మకూడదు.

31. కాని ప్రయోజనంబు నమకట్టదు తా భువి నెంత విద్యవాఁ
డైనను దొడ్డరాజుకొడుకైనదెట్లు? మహేశుపట్టి వి
ద్యానిధి సర్వవిద్యలకు దానె గురుఁడు వినాయకుండుఁదా

నేనుఁగు రీతినుండియు నదేమిటికాడడు పెండ్లి భాస్కరా.

దైవానుకూల్యము లేక ఏకార్యమును జరుగదు. ఎంతగొప్పవాడైననూ, ఎన్ని విద్యలు నేర్చిననూ విద్యలకధిదేవుడైననూ, ఏనుగంతటి బలము కలవాడైననూ వినాయకుడు పెండ్లి యాడలేనట్లే, ఎవరి వలననూ దైవసంకల్పము లేనిదే పని జరగదు.

32. కామిత వస్తుసంపదలు గల్గుఫలంబొరులాసపడ్డచో
నేమియుఁబెట్టఁడేని సిరియేటికి? నిష్ఫలమున్న బోయినన్
బ్రామికపడ్డ లోకులకుఁ బండఁగనే మది యెండిపోవఁగా
నేమిఫలంబు? చేఁదు విడదెన్నటికైన ముసిండి భాస్కరా.

భాగ్యవంతుడు పరోపకారి కానిదే అతని భాగ్యమునకు ముష్టిచేదు చెట్టువలనే ఫలితము లేదు.

33. కారణమైన కర్మములు కాక దిగబండ వెన్ని గొందులం
దూటిన నెంతవారలకు దొల్లి పరీక్షిత్తు శాపభీతుఁడై
వారిధినొప్ప నుప్పరిగపైఁ బదిలంబుగఁ దాగియుండినం
గ్రూరభుజంగదంతహతిగూలఁడె లోకు లెఱుంగ భాస్కరా.

కర్మఫలము ఎట్టివారికినీ దాటరానిది. అది శాపభీతిలో భయపడి ఒంటి స్థంబపు మేడమదనున్న పరీక్షిత్తును కబళించినట్లే కబళిస్తుంది.

34. కులమున నక్కడక్కడనకుంలితధార్మికుఁడొక్కడొక్కడే
కలిగెడుగాక పెందఱుచు గల్గగనేరరు, చెట్టుచెట్టునన్
గలుగఁగ నేర్చునే గొడుగుకాములు చూడఁగ నాడనాడనిం
పలరఁద నొక్కటొక్క టినయంబునఁజేకురుగాక భాస్కరా.

ధర్మజ్ఞుడు గొడుగు కొయ్యలు వలెనే అతి అరుదైన వ్యక్తి.

35. క్రూరమనస్కులౌ పతుఁలగొల్చి వసించిన మంచివారికిన్
వారిగుణంబెపట్టి చెడువర్తన వాటిలు; మాధురీ జలో
దారలు గౌతమీ ముఖమహానదు లంబుధిఁ గూడినంతనే
క్షారముఁచెందవే మొదలి కట్టడలిన్నయుఁ దప్పి భాస్కరా.

క్రూరాత్ములను సేవించు వ్యక్తికి కూర గుణములే వచ్చును. అది ఎట్లన తియ్యని నదీజలములు సాగరమున కలిసి ఉప్పగా మారినట్లే.

36. గిట్టుట కేడగట్టడ లిఖించిన నచ్చటఁగాని యొండుచోఁ
బుట్టదు చావు? జానులవుస్కల నూడిచి కాశిఁ జావ గా
ల్గట్టిన శూద్రకున్ భ్రమలఁగప్పచు దద్విధి గుబ్బమౌచునా
పట్టునఁగొంచు మట్టిడ బ్రాణముదీసెగదయ్య భాస్కరా.

విధిలిఖితము దాటుట కెవరికిని వశముకాదు. శూద్రక మహారాజు కాశీలో చావు కోరుకుని మోకాటి చిప్పల కోసికొనినను మాయగుబ్బము వలె వచ్చి వాని చావు ను మట్టి వృక్షము కడ కల్పించెను.

37. ఘనబలసత్త్వ మచ్చుపడఁ గల్గినవానికి హాని లేనిచో
దనదగుసత్త్వమే చెఱుచుఁదన్ను; నదెట్లన; నీరులావుగాఁ
గను వశియించినన్ చెఱువుకట్టకు సత్త్వముచాలకున్న
గనుమలు పెట్టినట్టనడిగంటి తెగంబడకున్నె? భాస్కరా.

అధిక బలము కల్గిన వాడు ఇతరులు తనకు హాని చేయక పోయినను, నదిలో ఎక్కువ నీరున్నప్పుడు మధ్యలో గండి పడినట్లు తన బలముతోనే నాశనమగును.

38. ఘనుఁడనట్టివాఁడు నిజకార్యసముద్ధరణార్థమైమహింబని
వడి యల్పమానవుని బ్రార్థనచేయుటతప్పగాదుగా, యన
ఘుఁత గృష్ణజన్మమున నావసుదేవుఁడుమీఁద టెత్తుగా గను
గొని గాలిగానిడరాళ్ళకుమ్రొక్కఁడె నాఁడు భాస్కరా.

వసుదేవుడు శ్రీకృష్ణ జననకాలమున గాడిద కాళ్లు పట్టినట్లే ఆపద సమయమున గొప్పవాడైనను నీచుని ఆశ్రయించినను తప్పలేదు.

39. ఘనుఁడొకవేళ గీడ్పడిన గ్రమ్మఱ నాతనిలేమి వాపఁగాఁ
కనుగొన నొక్కసత్త్రభువుగాక నరాధము లోపరెందఱుం
బెనుఁ జెఱు వెండినట్టితఱిఁ బెల్లున మేఘుఁడుగాక నీటితో
దనుపదుషారముల్ శతశతంబులుచాలునటయ్య భాస్కరా.

పెద్ద చెరువు ఎండిపోయినచో మేఘము వర్షిస్తేనే అది నిండుతుంది. 'ఏనుగుపడిన ఏనుగే లేవనెత్తవలె' నన్నట్లు, గొప్పవాడు బీదవాడైన వేరొక ధనవంతుడే అతనిని ఆదుకోగలడు. బీదవాళ్లు ఎంతమంది యైనను సరిపోరు.

40. చంద్రకళావతంసు కృపచాలనివాడు మహోత్ముఁడైనఁదా
సాంద్రవిబూతిఁబాసి యొక జాతి విహీనుని గొల్చియుంటయో
గీంద్రనుతాంఘ్రి పద్మ మతిహీనత నొందుట కాదుగా హరి
శ్చంద్రుడువీరబాహుని నిజంబుగ గొల్వడెనాఁడు భాస్కరా.

దైవకృప లేనప్పుడు ఎంత రాజాధిరాజైనను నీచుని సేవింపవలెను. ఇది తెలివితక్కువ కాదు. హరిశ్చంద్రుడు వీరబాహుని సేవించడము దైవోప హతుడైనందుననే.

41. చక్కదలఁపగా విధివశంబున నల్పునిచేతనైనఁ దా
జిక్కి యవస్థలం బొరలుఁజెప్పగరాని మహాబలాఢ్యుఁడున్
మిక్కిలి సత్త్వసంపదలమీఱిన గంధగజంబు మావటీఁ
డెక్కియదల్చికొట్టికుదియించిననుండడెయోర్చి భాస్కరా.

దైవకృప లేనప్పుడు బలవంతమైన ఏనుగు కూడ మావటి వాని చేతిలో బందీయే.

42. చదువది యెంతగల్గిన రసజ్ఞత యించుకచాలకున్న నా
చదువు నిరర్థకంబు గుణసంయుతు లెవ్వరుమెచ్చ రెచ్చటం

బదునుగ మంచికూర నలపాకము చేసిననైన నందు నిం
పొడవెడు నుప్పలేక రుచిపుట్టఁగ నేర్చునటయ్య భాస్కరా.

ఎంతటి విద్యావంతుడైనను విద్యలలో సారము గ్రహింపకున్న గుణవంతులు మెచ్చరు. నలపాకము కైనను కొంచెము ఉప్పు లేకున్న రుచి కల్గదు.

43. చాలఁ బవిత్రవంశమున సంజనితుండగునేని యెట్టి దు
శ్శీలునినైనఁ దత్కుల విశేషముచే నొకపుణ్య డెంతయుం
దాలిమి నుద్ధరించును; సుధానిధిఁ బుట్టఁగఁగాదె శంబుఁడా
హాలాహలనలంబు గళమందు ధరించుట పూని భాస్కరా.

కులములో నున్న గుణహీనుని మెచ్చునట్లు కులహీనుని మెచ్చరు. పాలసముద్రము లో పుట్టినందుననే హాలాహలము శంకరునికి ప్రీతిపాత్రమయ్యెను.

44. చేరి బలాధికుండెరిగిఁ చెప్పిన కార్యము చేయకుండినన్
బారము ముట్టలేఁడొక నెపంబున దాఁజెడు నెట్టిధన్యుఁడున్
బోరి పాండుపుత్త్రులకు భూస్థలిభాగము పెట్టమన్న కం
సారిని గాకుచేసి చెడడాయెనె కౌరవభర్త భాస్కరా.

బలాధికుడైన (శ్రీకృష్ణుడు) వాడు చెప్పిప పనిని చేయని వాడు దుర్యోధనుని వలె నే చెడిపోవును.

45. చేసిన దుష్టచేష్ట నది చెప్పక నేర్చునఁగపిచ్చిపుచ్చి తా
మూసినయంతటన్ బయలుముట్టక యుండదదెట్లు రాగిపై
బూసిన బంగరుంజెదరిపోవగడంగిన నాఁడు నాటికిన్
దాసినరాగి గానఁబడదా జనులెల్ల రెఱుంగు భాస్కరా.

నీచుడు నీచకార్యము చేసి దాచిపెట్టినను రాగిపై పూసిన బంగారు పూత వలె బయటపడును.

46. తగిలి మదంబుచే నెదిరిఁదన్ను నెఱుంగక దొడ్డవారితో
బగఁగొని పోరుటెల్ల నతిపామురుఁడై చెడు టింతెకాక తా
నెగడి జయింపనేరఁడది నిక్కము తప్పదు; రాత్రిలోపలన్
డెగి యొకకొండతోఁ దగరు ఢీకొని దాకిననేమి? భాస్కరా.

బలహీనుడు కావరముతో ఎదుటి బలము తెలియని బుద్ధిహీనతతో బలవంతుల తో విరోధము తెచ్చుకొన్న పొట్టేలు కొండతో ఢీకొనినట్లే తన వినాశమును తనే తెచ్చుకొనును.

47. తడవఁగరాదు దుష్టగుణుఁదత్త్వమెరుంగ యెవ్వరైన నా
చెడుగుణమిట్లు వల్లదని చెప్పిన గ్రక్కునగోపచిత్తుఁడై
గదుఁదెగఁజూచుగా మఱుగఁగాఁగిన తైలము నీటిబొట్టుపై
బదునెడ నాక్షణం బెగసి భగ్గు మండకయున్నె భాస్కరా.

దుర్జనుడు తనకు హితము చెప్పిన వారిని కూడా నాశము చేయుటకు చూచునే గాని హితము పెడచెవిన బెట్టును. ఇతను బాగా కాగిన నూనె వంటి వాడై హితమ నెడి నీటి బిందువును భగ్గుమనెడి మంటవలె దహించును.

48. తనకు ఫలంబులేదని దలపోయడు కీర్తిగోరు నా
ఘనగుణశాలి లోకహిత కార్యము మిక్కిలి భారమైన మే
లనుకొనిపూను శేషుఁడు సహస్రముఖంబుల గాలిఁగ్రోలి తా
ననిశము మోవడేమటి మహాభారమైన ధరిత్రి భాస్కరా.

కీర్తి కాముకుడు తన లాభమును ఆశించక ప్రజలు మేలునే ఆశించును. ఆదిశే షుని వలె భూమి మోయుట వలన తనకేమి మేలు యని ఆలోచింపడు.

49. తనకు సదృష్టరేఖ విశదంబుగఁ గల్గినగాని లేనిచో
జనులకు నెయ్యుడన్ బరుల సంపదలవల్ల ఫలంబులేదుగా
కనువగ లెస్సగాఁ దెలివి గల్గినవారికిఁగాక గ్రుడ్డికిన్

కనపడునెట్లు వెన్నెలలుగాయగ నందొకరపు భాస్కరా.

వెన్నెల అందం కళ్ళున వానికే తెలుయును కాని గుడ్డివానికి కాదుగా . అదేమాది రిగా అదృష్టమున్న వానికే భాగ్యము లభించును

50. తాలిమితోడుతం దగవు తప్పక నేర్పరి, యొప్పదప్పలం
బాలనసేయుఁగాకట నుపాయవిహీనుఁడు సేయనేర్చునే?
పాలను నీరు వేరుపరుపంగ మరాళ మెరుంగుగాక మా
ర్జాల మెరుంగునే తదురుచారు రసజ్ఞతఁబూన భాస్కరా.

పాలని నీళ్ళను వేరుచేసే శక్తి హంసకు మాత్రమే వుంది. పిల్లికి అటువంటి శక్తి లేదు. ఆదేవిందంగా ఓర్పుతో తగవుయొక్క మంచి చెడ్డలు గ్రహించిగల నేర్పుకల వాడు మాత్రమే నిర&ంయించును. అవివేకుడు నిర్ణయించలేడు.

51. తాలిమితోడగూరిమి గృతఘ్నునకెయ్యెడ నుత్తమోత్తము
ల్మేలొనరించిన గుణము మిక్కిలికీడగుఁ బాముపిల్లకున్
బాలిడి పెంచినన్విషము పాయగ నేర్చునె దాని కోఱలం
జాలంగ సంతకంతకొకచాయను హెచ్చునుగాక భాస్కరా.

పాముపిల్లకు పాలుపోసి పెంచినా దాని విషము క్రమముగా పెరుగుతుంది కాని చెరువులో నీరు నిల్వనట్లే కుటుంబ యజమానికి బాధ్యత తెలియనప్పుడు ఎంత ధనమున్నను అపవ్యయమే అగును.

52. తెలియని కార్యమెల్లఁ గడతేర్చుటకొక్కవివేకి జేకొనన్
వలయునట్టైనదిద్దుకొనవచ్చుబ్రయోజనమాంధ్యమేమియుం
గలగదు ఫాలమందు దిలకంబిడునప్పడు చేతనద్దమున్
గలిగిన జక్క జేసికొనుగాదె నరుండది చూచి భాస్కరా.

నిపుణుని సాయమున్నచో ఎంత దుర్లభమయిన కార్యమైనను అద్దము సాయము తో బొట్టు దిద్దుకున్నట్లు చేయవచ్చును.

53. దక్షుఁడు లేనియింటికిఁ బదార్థము వేళొక చోటనుండి వే
లక్షలు వచ్చుచుండినఁ బలాయనమై చను గల్లగాదు ప్ర
త్యక్షము వాఁగులున్ వఱదలన్నియు వచ్చిన నీరు నిల్చునే
యక్షయమైన గండి తెగినట్టి తటాకములోన భాస్కరా.

చెరువులోకి కొండవాగులు, జలప్రవాహములు వచ్చి చేరినా అది నిలువ వుండదు. ఆవిధంగానే కుటుంబబాధ్యత వహించునట్టి యజమానిలేని యింటికి ధనము లక్షలువచ్చినా నిలువవుండదు.

54. దానపరోపకార గుణధన్యత చిత్తములోన నెప్పుడున్
లేని వివేక శూన్యునకు లేములు వచ్చినవేళ, సంపదల్
పూనినవేళ, నొక్కసరిపోలసు, జీకున కర్ధరాత్రియం
దైన నదేమి పట్టపగలైన నదేమియు లేదు భాస్కరా.

గుడ్డివానికి రేయి పగులు తేడా ఎలా లేదో అదేవిధంగా దానపరోపకారములేని మూర్ఖునకు పేదరికంలో వున్నా ధనికుడైనా బేధంవుండదు.

55. దానము సేయగోరిన వదాన్యు కీయఁగ శక్తిలేనిచో
నైనఁ బరోపకారమునకై యొక దిక్కునఁ దెచ్చియైన నీ
బూనును మేఘుఁడంబుధికిబోయి జలంబులదెచ్చి యీయడే
వాన సమస్త జీవులకు వాంఛిత మింపెనలార భాస్కరా.

దాతయగు వ్యక్తి తన దగ్గర ధనము లేకున్నను మబ్బు సముద్రము నిండి నీరు తీసుకొన్నట్లు ఇంకొకరి దగ్గరినించి యైన ధనము తెచ్చి దానము చేయును.

56. దానము సేయనేరనియధార్మికుసంపదయుండియుండియున్
దానెపలాయనంబగుట తథ్యము; బూరుగు ప్రానుగాచినన్
దానఫలంబు లూరక వృథాపడిపోవవె యెండి గాలిచే
గానలలోన నేమిటికిఁగాక యభోజ్యములౌట భాస్కరా.

దాత కాని వ్యక్తి ధనము బూరుగు చెట్టు కాయల వలె ఎవరికి లాభించక తానే మాయమగును.

57. నడవక చిక్కి లేమియగునాఁడు నిజోదరపోషణార్థమై
యడగిభుజించుటల్ నరులకారము వ్యంగ్యముకాదు పాండవుల్
గడుబలశాలు లేవురు నఖండవిభూతిఁదొలంగి భైక్ష్యముల్
గడువరె యేకచక్రపురిఁగుంతియు దారొకచోట భాస్కరా.

బలవంతులైనను కాని కాలముకలిసిరానప్పడు పాండవుల వలె యాచించినను తప్పలేదు.

58. నుడువులనేర్పు చాలని మనుష్యుఁ డెరుంగతప్పనాడినం
గడుఁగృపతోఁ జెలంగుదురుగాని యదల్పరుతజ్ఞు లెల్లఁడ
ప్పడుగులు వెట్టుచున్నప్పడు బాలుని ముద్దుసేయగా
దొడగుడు రింతెకానిపడద్రోయుదురె యెవ్వరైన భాస్కరా.

పోగాలము దాపురించిన వారు మిత్ర వాక్యమును రావణుడు విభీషణుని మాటను విననట్లే వినుట కిష్టపడరు.

59. నేరిచి బుద్ధిమంతుఁ డతినీతివివేకము దెల్పినం జెడం
గారణమున్న వాని కది కైకొనఁగూడదు నిక్కమే దురా
చారుఁడు రావణాసురుఁడసహ్యమునొందఁడె చేటుకాలముం
జేరువయైనాఁడు నిరసించి విభీషణుబుద్ధి భాస్కరా.

ధీశాలికి కాని కాలము వచ్చినప్పుడు, అగ్ని క్షీణించి పోయినప్పుడు పుల్లలను ఎగదోసినట్లే, ఇంకొకరు సాయపడియే తీరవలెను.

60. నొగలినవేళ నెంతిటిఘనుండును దన్నొకరొక్క నేర్పుతో

నగుపడి ప్రోదిసేయక తనంతట బల్మికిరాఁడు నిక్కమే
జగబున నగ్నియైన గడు సన్నగిలంబడియున్న నింధనం
బెగయఁగద్రోఁచియూదకమఱెట్లురవులుకొననేర్చుభాస్కరా.

దుర్జనుడు సజ్జనులను తిరస్కరించి చేయు కార్యము, దక్షుడు పరమేశ్వరుని తిరస్కరించి చేసిన యజ్ఞము వలెనే, విఫలమగుటయే గాక ప్రాణహాని కూడ కల్గును.

61. పండితులైనవారు దిగువందగ నుండగ నల్పుడొక్కడు
ద్దండతఁ బీఠమెక్కిన బుధప్రకరంబున కేమియెగ్గగున్
గొండొక కోఁతి చెట్టు కొనకొమ్మలనుండగ గ్రింద గండభే
రుండ మదేభసింహ నికురుంబములుండవె? చేరి భాస్కరా.

పండితులుకింద కూర్చున్నప్పుడు ఒక నీచుడు పీఠమదిరోహించినను వారికేమి లోటు లేదు. అది ఎట్లన గండభేరండము మొదలగు పక్షులు నివాసమున్న చెట్టు ను కోతి ఎక్కినట్లే.

62. పట్టుగ నిక్కుచున్ మదముబట్టి మహాత్ముల తూలనాడినం
బట్టిన కార్యముల్ చెడును బ్రాణముబోవు నిరర్థదోషముల్
పుట్టు; మహేశుఁగాదని కుబుద్ధినొనర్చిన యజ్ఞతంత్రముల్
ముట్టకపోయి దక్షునికి మోసమువచ్చె గడయ్య భాస్కరా.

దుర్జనుడు సజ్జనులను తిరస్కరించి చేయు కార్యము, దక్షుడు పరమేశ్వరుని తిరస్కరించి చేసిన యజ్ఞము వలెనే, విఫలమగుటయే గాక ప్రాణహాని కూడ కల్గును.

63. పరహితమైన కార్య మతిభారముతోడిదియైనఁ బూను స
త్పురుషులు లోకముల్పొగడఁ బూర్వము నందొకఱాల వర్ష
మున్ కురియఁగ జొచ్చినన్ గదిసిగొబ్బునగోజనరక్షణార్థమై
గిరినొక కేలనైతి నంట కృష్ణుండు ఛత్రముభాతి భాస్కరా.

సజ్జనుడు ఎంతటి దుర్లభమైన కార్యమునైనను పరోపకారమునకై, శ్రీకృష్ణుడు గోవర్ధనగిరిని అనాయాసముగా ఎత్తినట్లే, నిర్వహించును.

64. పలుచని హీన మానవుడు పాటిదలంపక నిష్ఠురోక్తులం
బలుకుచు నుండుఁగాని మతిభాసురుఁడై సుగుణప్రపూర్ణుఁడ
ప్పలుకులఁపల్కబోవడు నిబద్ధిగ; నెట్లన వెల్తికుండ దాఁ
దొలుకుచునుండుగానిమతితొల్కునెనిండుఘటంబు భాస్కరా.

నిండుగా నీరున్న కుండ తొణకనట్లే, సజ్జనుడు దుష్టుని వలె కాక ఔచితూచి మాటలాడును.

65. పలుమాఱుసజ్జనుండుప్రియభాషలపల్కు (కఠోరవాక్యముల్
పలుకఁడొకానొకప్పడవి పల్కిన గీదునుగాదు నిక్కమే
చలువకువచ్చి మేఘు దొకజాడను దా వడగండ్ల రాల్చినన్
శిలలగునఃటు వేగిరమె శీతల నీరముగాక భాస్కరా.

మేఘుడు వడగండ్లు కురిపించినను అవి చల్లనినీరుగా మారునుగాని రాళ్లుగా వుండవు. సజ్జనుని కఠినమయిన మాటల వలన కూడా వడగండ్ల వలె మేలే కల్గునుగాని కీడు కల్గదు.

66. పాపపుఁద్రోవవాని కొకపట్టున మేను వికాస మొందినన్
లోపల దుర్గుణంబె ప్రబలుంగద నమ్మగఁగూడ దాతినిన్
బాపటకాయకున్ నునుపు పైపయిగల్గినఁ కల్గుగాక యే
రూపున దానిలోఁగల విరుద్ధపుఁజేదు నశించు భాస్కరా.

'మేడిపండు చూడ మేలిమైయుండు, దాని పొట్ట విచ్చిచూడ పురుగులుండు' అన్న చందముగా, చేదు పుచ్చకాయ పైకి నునుపగావుండి లోపల చేదుకలిగినట్లు దుర్మార్గుడు అందగాడైనను అతని దుష్టగుణము పోదు.

67. పూనిన భాగ్యరేఖ చెడిపోయినపిమ్మట నెట్టి మానవుం
డైనను వానినెవ్వరుఁ బ్రియంబునఁ బల్కరు బిల్వరెచ్చటం
దానిదియెట్లొకో యనినఁ దథ్యము పుష్పము వాడి వాసనా
హీనతనొందియున్న యెడనెవ్వరుముట్టుదురయ్య భాస్కరా.

కాని కాలము వచ్చిన వారిని విబుధులు కూడ ఎండిపోయిన పూవును పారవేసి నట్లే వదలివైతురు.

68. పూరిత సద్గుణంబుగల పుణ్యునకించుక రూపసంపదల్
దూరములైన వానియెడ దొడ్డగఁజూతురు బుద్ధిమంతు లె
ట్లారయ గొగ్గులైన మఱియందులమాధురిచూచి కాదె ఖ
ర్జూర ఫలంబ్రియము చొప్పడ లెకులుగొంట భాస్కరా.

ఖర్జురము పైకి ముడతలతోవున్నా మంచిరుచిగా వుండటంవల్ల అందరు కొను క్కొని తింటారు. కురూపి యైనను గుణవంతుని ప్రజలు ఖర్జూరమును ఆదరించి నట్లే ఆదరింతురు.

69. ప్రేమనుగూర్చి యల్పునకుఁ బెద్దతనంబును దొడ్డవానికిం
దామతి తుచ్ఛపుంబని నెదం బరికింపగ యీయరాదుగా
వామకరంబుతోడ గుడువం గుడిచేత నపానమార్గముం
దోమగవచ్చునే మిగులఁ దోచని చేతలుగాక భాస్కరా.

ఆలోచన లేని పాలన ఎడమ చేతితో భోజనము చేయుట, కుడి చేతితో మల ద్వారమును కడుగు కొనుట వంటిది (నీచునకు ఉద్యోగము, మంచివానికి నీచ వృత్తినిచ్చుట ఆలోచనలేని పాలన)

70. ఫలమతిసూక్ష్మమైననృపాలుఁడుమంచి గుణాఢ్యుఁడైనచో
నెలమి వివేకులాతని కపేక్షయొనర్తు, రదెట్లు చంద్రికా
విలసనమైనఁ దాననుభవింపఁ జకోరము లాసఁచేరవే

చలువగలట్టివాఁడగుటఁ జెందురు నెంతయుగోరి భాస్కరా.

బుద్ధిమంతులు, వెన్నెల పిట్టలు చంద్రునియొక్క కాంతిని కోరునట్లు, సన్మార్గుడైన రాజు పాలననే కోరుదురు.

71. బంధుర సద్గుణాఢ్యుఁ డొకపట్టున లంపటనొందియైన దు
స్సంధిఁ దలంప డన్యులకుఁ జాల హితంబొనరించుగాక శ్రీ
గంధపు జెక్క రాగిలుచుగాఁదె శరీరుల కుత్సువార్థమై
గంధము లాత్మఁబుట్ట దఱుగంబడియుండుట లెల్ల భాస్కరా.

సజ్జనుడు మంచిగంధపు చెట్టు వంటివాడు తనకు కీడు చేసినను ఇతరులకు మేలొనర్చునే కాని కీడుచేయడు.

72. బలముదొలంగుకాలమునఁబ్రాభవసంపద లెంతధన్యుఁడున్
నిలుపుకొనంగ నోఁపడది నిశ్చయ మర్జునఁ డీశ్వరాదులం
గెలిచినవాఁడు బోయలకుగీడ్వడి చూచుచుఁగృష్ణభార్యలం
బలువుర నీయఁడే నిలువఁబట్ట సమర్థుఁడుగాక భాస్కరా.

దైవబలము లేనప్పుడు ఎంతటి విద్యయైనను రాణింపదు, గొప్ప ధనుర్ధారి అయిన అర్జునుడు కృష్ణ నిర్యాణము తర్వాత బోయలచేత ఓడిపోయినట్లే ఎంతటి విద్యయైనను దైవీశక్తి లేక రాణింపదు.

73. బలయుతుఁడైన వేళ నిజబంధుఁడుతోడ్పడుగాని యాతడే
బలము తొలంగెనేని తనపాలిటశత్రు, వదెట్లుబూరుణడై
జ్వలనుఁడుకానఁగాల్చు తరిసఖ్యమునుజూపును వాయుదేవుఁడా
బలియుఁడు సూక్ష్మదీపమగుపట్టున నార్పడెగాలి భాస్కరా.

స్వబలము వున్నప్పుడే మిత్రులు తోడ్పడుదురు. కేవలము మిత్రులమీద ఆధారపడుట దీపము గాలిలో అల్లాడినట్లే.

74. బల్లి దుఁడైన సత్ర్రభువు పాయకయుండినఁగారి రచ్చలోఁ
జిల్లరవారు నూఱుగురు సేరిన దేజము గల్గదెయ్యడన్
జల్లని చందురుండెడసి సన్నపు జుక్కలు కోటియున్న రం
జిల్లునె వెన్నెలల్ జగముచీకటులన్నియుబాయ భాస్కరా.

చిన్న నక్షత్రములు కోటివున్నను ఒక చంద్రుని వలె ప్రకాశింపలేవు. అట్లే ఒక సత్ర్ర భువు తేజము నూర్గురు చిన్న సామంతులకు కల్గదు.

75. భుజబలశౌర్యవంతులగు పుత్రులఁగాంచినవారికెయ్యడన్
నిజహృదయీప్సితార్థములు నిక్కచుకుఱఁకుంతిదేవికిన్
విజయబలాఢ్యుఁడర్జునుండుఁ వీరపరాక్రమమొప్ప దేవతా
గజమును దెచ్చి తల్లి వ్రతకార్యము దీర్చఁడె తొల్లి భాస్కరా.

బాహుబల గుణసంపన్నులైన కొడుకులున్న తల్లికి, కుంతీదేవికి ఐరావతము నందు గల కోర్కె నెరవేరిన రీతి, పరాక్రమవంతులైన కొడుకులున్న కోర్కెలు అతిసులభం గా నెరవేరుతాయి .

76. భూనుతులైన దేవతలు పూర్వము కొందఱు వావివర్తనల్
మాని చరింపరోయనుచు మానవులట్ల చరింపఁబోల దం
భోనిదులన్నియుం దనదుపుక్కిటబట్టె అగస్త్యుడంచు నా
పూనికెవ్వడోపునదిపూర్వమహత్త్వము సుమ్ము భాస్కరా.

పూర్వము అగస్త్యముని సముద్రాలన్నిటిని త్రాగివేసాడు. అది నేటిమానవునికి సాధ్యముకాదు. అట్లాగే గతంలో కొందరు దేవతలు చెడుపనులు చేశారు. ఆ దురాత్ములను ఉదాహరణగా తీసికొని దుష్టమార్గము లవలంభించుట కంటె సన్మార్గుల సత్కార్యములను తలచుకొనుటమేలు.

77. భూపతికాత్మబుద్ధి మదిబుట్టనిచోటఁ ప్రధానులెంత ప్ర
జ్ఞాపరిపూర్ణులైనఁ గొనసాగదు కార్యము కార్యదక్షులై

యోపిన ద్రోణ భీష్మకృపయోధు లనేకులుకూడి కౌరవ
క్ష్మాపతి కార్యమేమయిన జాలిరె చేయగవారు భాస్కరా.

నిపుణమతియైన రాజు లేనప్పుడు, ఎంతటి నైపుణ్యము కల్గిన వారైనను, భీష్మ ద్రోణుల వలె, రాజకార్యము నెరవేర్పలేరు.

78. భూరిబలాఢ్యుడైనఁ దలపోయక విక్రమశక్తిచే నహం
కారమునొందుటన్ తగవుగా దతఁడొక్కెడ మోసపోవునా
వీరవరేణ్యుఁడర్జునుఁడు వింటికి నేనధికుండ నంచుఁ దా
ఊరకవింటి నెక్కిడఁగనోపఁడు కృష్ణుడు లేమి భాస్కరా.

శ్రీ కృష్ణుని నిర్యాణాంతరము అర్జునుడు ధనుస్సు ఎక్కుపెట్టుటకైనను సమర్థుడు కాలేకపోయెను. అహంకారికి అన్ని సమయములందు విజయము చేకూరదు. ఎంతటి బలవంతుడైనను కాని కాలము వచ్చినపుడు తలవంచియే తీరవలెను.

79. భ్రష్టుని కర్థవంతులగు బాంధవులెందఱు కల్గినన్ నిజా
దృష్టములేదు గావున దరిద్రతఁబాపఁగ లేరు; సత్కృపా
దృష్టిని నిల్పి లోకుల కతి స్థిర సంపదలిచ్చు లక్ష్మి యా
జ్యేష్ఠ కదేటింకిం గలుగఁజేయుదు తోడనె పుట్టి భాస్కరా.

కించిదదృష్టము వలననే సంపదలు చేకూరును కాని ధనవంతులైన బంధువుల వల్ల కాదు. లక్ష్మీదేవి అక్క అయినను జ్యేష్టాదేవికి సంపద కల్గనట్లే.

80. మది దను నాసపడ్డయెడమంచి గుణోన్నతుఁడెట్టి హీనునిన్
వదలఁడు మేలుపట్టున నవశ్యము మున్నుగ నాదరించుగా
త్రిదశవిమానమధ్యమునఁదెచ్చి కృపామతిసారమేయముల్
మొదలనిండె ధర్మజుఁడుమూఁగిసురావళిచూడ భాస్కరా.

ధర్మజుడు తన్ను ఆశ్రయించిన కుక్కను దేవతా విమాన మధిరోహింప జేసినట్లే, సజ్జనుడు ఎంతటి నీచునసైన తన నాశ్రయించిన విడువడు.

81. మాటలకోర్వఁజాలఁ డభిమాన మగ్రుఁడు ప్రాణహానియౌ
చోటులనైనఁ దానెదురు చూచుచునుండుఁ గొలఁకులోపల
న్నీటఁ మునిగినప్పు డతినీచములాడిన రాజరాజు పో
రాట మొనర్చి నేలబడడాయెనె భీముని చేత భాస్కరా.

అభిమానము కలవాడు దుర్యోధనుని వలెనే ప్రాణ హానికైనను ఒప్పకొనును కాని మానహాని నోర్చలేడు.

82. మానవనాథుఁ డాత్మరిపుమర్మ మెరింగినవాని నేలినం
గాని జయింపలే డరుల గార్ముకదక్షుడు రామభద్రుఁడా
దానవనాయకున్ గెలువఁదానెటులోపుఁ దటీయ నాభికా
స్థానసుధ న్విభీషణుఁడుతార్కొనిచెప్పకయున్న భాస్కరా.

శత్రువును నిర్జించుటకు సరియైన సమయములో సరియైన వ్యక్తిచే రహస్య సేకరణ జరుగవలెను. విభీషణుడు రావణ మృత్యు రహస్యము తెల్పినట్లే సరియైన సమయమున సరియైన వ్యక్తి వలన రహస్యము లెరుగవలెను.

83. మానవు డాత్మకిష్టమగు మంచి ప్రయోజన మాచరించునో,
గానఁగ యల్పుఁడొక్కడిదిగాదని పల్కిన వాని పల్కుకై
మానఁక జూడఁ డాపని సమంచింత భోజనవేళ నీగఁకా
లూనిన వంటకంబు దినకుండఁగ నేర్పగుచోటు భాస్కరా.

మానవుడు తనకు మేలొనర్చు కార్యమును, ఈగ వాలిన భోజనము వలె, నీచ మానవుల మాటలను పెడచెవిని పెట్టి నెరవేర్చవలెను.

84. మానిని చెప్పనట్లలకమాలినవాఁ డటు చేసినన్ మహా
హానిఘటించు నే ఘనునికైన నసంశము ముర్విపైఁగృపా

హీనత బల్కినన్ దశరథేశ్వరుఁ డంగనమాటకై గుణాం
భోనిధి రాము బాసి చనిపోవఁడె శోకముతోడ భాస్కరా.

తెలివిలేని వాడు తాలి మాటలను విన్న, దశరథుని వలెనే ప్రాణహాని, మానహాని పొందును.

85. మునుపొనరించు పాతకమమోఘముజీవులకెల్ల బూని యా
వెనుకటిజన్మమం దనుభవింపక తీఱదు, రాఘవుండు వా
లిని బడవేసి తామగులీల యాదూద్భవుఁడై కిరాతుచే
వినిశిత బాణపాతమున వీడ్కొనఁడే తనమేను భాస్కరా.

పురాకృతకర్మము అనుభవింప ఎవరికైనను తీరదు. శ్రీకృష్ణునంతవాడు గూడ, వాలిని చెట్టు చాటునుంచి చంపిన పాపమును, బోయవాని చేతిలో అనుభవింపవలసి వచ్చెను.

86. రాకొమరుల్ రసజ్ఞునిఁ దిరంబుగ మన్నన నుంచినట్లు భూ
లోకమునందు మూఢుఁ దమలోపలనుంపరు, నిక్కమేకదా
చేకొని ముద్దుగా చదువు చిల్కను బెంతురుగాక పెంతురే
గాకము నెవ్వరైన శుభకారణ సన్మని సేవ్య భాస్కరా.

రాజులు రసజ్ఞుని పోషింతురే గాని నీచుల పోషించరు. చిలుకను పెంచుకొనునట్లు లోకులు కాకిని పెంచుకొనరు.

87. లోకమున దుర్జనుల లోఁతు లెఱుంగక చేయరాదు సు
శ్లోకుఁడు జేరినంగవయ జూతురుచేయదు రెక్కసక్కెముల్
కోకిలఁగన్నచోట గుమిగూడి యసహ్యపు గూతలార్చుచు
గాకులు తన్నవే తటిమి కాయము తల్లడమంద భాస్కరా.

సజ్జనుడు దుష్టులను చేరినచో వారు కాకులు కోకిలను తరిమినరీతిగా మంచి వాని నొప్పించి తరమివైతురు.

88. లోనుదృఢంబుగాని పెనులోభినమ్మియు సాధ్యకార్యముల్
గానక పూనునే నతడు గ్రక్కునఁ గూలును నోటి పుట్టిపై
మానవుఁడెక్కిపోవ నొక మాటుపుటుక్కున ముంపకుండునే
దానొకలోఁతునం గడిపి దాని ధరింపగలేక భాస్కరా.

స్థిరమైన నడవడి లేనివానిని నమ్మి గొప్ప కార్యమును సాధింపబూనుట 'కుక్కతోక' పట్టుకొని గోదావరి ఈదినట్లే' ఓటి పడవను నమ్ముకుని మహాప్రవాహమును దాటబూనుటయే.

89. వంచనయింతలేక యెటువంటి మహాత్ములనాశ్రయించినన్
గొంచెమె కాని మేలు సమగూడ దదృష్టము లేనివారికిన్
సంచితబుద్ధి బ్రహ్మనిశంబును వీఁపున మోఁచునట్టి రా
యంచకుఁదమ్మితూండ్లుదిననాయెగదా ఫలమేమి భాస్కరా.

కపటములేక ఎంత గొప్పవారిని సేవించినను ఇసుమంత అదృష్టము లేకయున్న, బ్రహ్మదేవుని మోయు రాయంచ తామర తూడుల దిని బ్రతికినట్లే, బ్రతుకగవలెను.

90. పట్టుచుఁ దండ్రి యత్యధమవర్తుఁడైనను గాని వానికిం
బుట్టిన పుత్రుకుండు తన పుణ్యవశంబున దొడ్డ ధన్యుఁడౌ
నెట్లన మఱ్ఱివిత్తుమును పెంతయు గొంచెము దానబుట్టునా
చెట్టు మహోన్నతత్వమును జెందదె శాఖలనుండి భాస్కరా.

తండ్రి ఎట్టివాడైనను పూర్వపుణ్యము గల కుమారుడు మఱ్ఱిచెట్టు (విత్తుచిన్నది) వలె విస్తరింపగలడు.

91. వలనుగఁ కానలందు బ్రతివర్షమునన్ బులి నాలుగైదు పి
ల్లలనుగను దూడనొక్కటినింగను ధేనువు రెండుమూడునేఁ
డులకటలైన బెబ్బులి కుటుంబము అల్పములాయెనాలమం

దలుగడువృద్ధిఁ జెంద వెయధర్మము ధర్మము దెల్ప భాస్కరా.

ధర్మాధర్మములే వంశాభివృద్ధి కల్గించును గాని అన్యముకాదు. అది ఎట్లన అధర్మ వర్తని యైన పెద్దపులి కన్న ధర్మవర్తనియైన గోవు మిన్నయైనట్లు.

92. వలదు క్రూర సంగతి యవశ్య మొకప్పడు సేయఁపడ్డచో
గొలఁదియెగాక యెక్కువలుగూడవు, తమ్ములపాకులోపలం
గలసిన సున్న మించుకయకాక మఱించుక ఎక్కువైనచో
నలుగడఁ జుఱ్ఱుజుఱ్ఱుమననాలుక పొక్కకయున్నె భాస్కరా.

దుష్టులతో సఖ్యము తమలపాకులో సున్నమువలె మితముగా నున్ననే ఫలము నిచ్చును. ఎక్కువైనచో హాని కల్గించును.

93. వానికి విద్యచేత సిరివచ్చునటంచును విద్య నేర్వంగాఁ
బూనినఁ బూనుగాక తనపుణ్యముచాలక భాగ్యరేఖకుం
బూనఁగ నెవ్వడోవు; సరిపో చెవి పెంచునుగాక దృష్టతా
హీనుఁడు కర్ణభూషణము లెట్లుగడింపఁగనోవు? భాస్కరా.

దురదృష్టవంతుడు 'తలగడగబోయిన వడగళ్ల వాన' యన్నట్లు ఎన్ని విద్యలు నేర్చిన ను అదృష్టమునకు సాటిరాదు.

94. సంతత పుణ్యశాలి నొకజాడను సంపద వాసిపోయి తా
సంతటఁబబొక నెట్టుకొని యప్పటినట్లు వసించియుండుమా
సొంతమునందుఁ జందురునినన్ని కళన్పెడఁబాసిబోయినం
గాంతివహింపఁడోటు? తిరుగంబడి దేహమునిండి భాస్కరా.

పుణ్యఫలముగల్గిన వానికి సంపద నశించినను తిరిగి వచ్చున అది ఎట్లన చందమామకు అమావాస్యనాడు నశించిన కళలు పున్నమినాటికి చేరునట్లు

95. సకలజన ప్రియత్వము నిజంబుగ, గల్గినపుణ్యశాలి కొక్కక

యెడ నాపదైన దడవుండదు వేగమెపాసిపోవునా, యకలుష
మూర్తియైన యమృతాంశుడు రాహువు తన్ను మ్రింగినన్
టకటకమానని యుండఁడె? దృఢస్థితి నెప్పటి యట్ల భాస్కరా.

జనప్రియుడయిన సజ్జనుడు కష్టములు పొందనను రాహుగ్రస్త చంద్రుని వలెనే త్వరగా విముక్తి పొందును.

96. సన్నుత కార్యదక్షు డొకచాయ నజప్రభ యప్రకాశమై
యున్నపుడైన లోకులకు నొండొక మేలొనరించు సత్యసం
పన్నుఁడు భీముఁడాద్విజుల ప్రాణముఁకావఁడెయేక చక్రమం
దెన్నికగా బకాసురుని నేపున రూపడఁగించి భాస్కరా.

యశస్వి అయిన పురుషుడు తాను చాటుగ వున్నను జనులకు మేలు చేయుట లో భీముని వలెనే ముందుకురికి బకాసురుని సంహరించును. తన కష్టములను చూచుకొనడు.

97. సరసగుణప్రపూర్ణునకు సన్నపు దుర్గణ మొక్క వేళయం
దొరసిన నిట్లు నీకుఁ దగునోయని చెప్పిన మాననేర్చుదా
బురద యొకించుకంత తముబొందినవేళల జిల్లవిత్తుపై
నొరసిన నిర్మలత్వమున నుండవె నీరములెల్ల భాస్కరా.

సద్గుణశాలి బురద నిండిన నీటివలె దుర్గుణములచే కష్టబడినను, మిత్రులమాట యను ఇండుపగింజ వలె త్వరలో తేరుకొనును.

98. సరసదయాగుణంబుగలజాణమహింగడునొచ్చియుండియుం
దరచుగా వాననికాసబడి దాయఁగవత్తురు లోకులెట్లనం
జెఱుకురసంబు గానుగను జిప్పిలిపోయినమీఁదఁ బిప్పియై
ధరఁబడియున్నఁ జేరవె ముదంబునఁజీమలు పెక్కు భాస్కరా.

చెరకు పిప్పి నేల బడినను వదలని చీమల వలె దాత నిర్ధనుడై దీనుడైనను అర్థులు చేరవత్తురు.

99. హరవివేకవర్తనల నన్నుతికెక్కిన వారిలోపలం
జేరినయంత మూఢులకుఁ జేపడ దానడత; యెట్టులన్నఁ గా
సారములోన హంసముల సంగతినుండెడి కొంగపిట్టకే
తీరునగల్గ నేర్చును దదీయగతుల్ దలపోయ భాస్కరా.

కొలనులో హంసలనడుమనున్న కొంగకు స్వగుణములు పోనేట్లే సజ్జనుల మధ్యను న్నను నీచుడు తన నీచత్వమును పోగొట్టుకునలేదు.

100. స్థానము తప్పివచ్చునెడఁ తానెటువంటి బలాఢ్యుడున్ నిజ
స్థానకుడైన యల్పుని కతంబునైనను మోసపోవుగా
కానలలోపలన్ వెడలలి గంధగజం బొకనాఁడు నీటిలోఁ
గానగ చొచ్చినన్ మొసలికాటున లోఁబడదోటు భాస్కరా.

'స్థానబలముగాని తనబలము కాదయా' అన్నట్లు నీటిలో నున్న మొసలి ఏనుగునైన పట్టగలదు. తమ తమ సెలవులు తప్పిన వారు ఆపదల పాలవుదురు.

101. సిరిగలవానని కెయ్యెడలఁ జేసి నే మేలది నిష్ఫలంబగున్
నెఱిగుఱిరాదు పేదలకు నేర్చునఁజేసని సత్ఫలంబగున్
పఱపునవచ్చి మేఘుఁ డొకవర్షము వాడిన చేలమీఁదటం
గురిసినఁగాక యంబుధల గుర్వంగ నేమిఫలంబు భాస్కరా.

మేఘుడు వానలులేక ఎండిపోవుచున్న చేలపై వర్షించిన లాభము కాని సముద్రము పై వర్షించిన ఏమి లాభము? అదేవిధంగా పేదవారికి సాయపడలి కాని ధనికులకు సాయపడిన ఏమిప్రయోజనము?